516328

# ఆంధ్రపత్రిక.


బెంగాలులో మళ్లీ క్షామం?
—2-వ పేజీ

నాగార్జున శిల్పపీఠం
—2-వ పేజీ



The Andhra Patrika, Madras. | Regd. No. 1118. | Vol 32. | FRIDAY. 7th September, 1945. | No. 133. | వెల ఒకఅణా. | Founder : K. Nageswara Rao.


## తిరిగి వచ్చినతర్వాత ప్రధాన నాయకులతో వేవెల్ చర్చలు?

### రాష్ట్రీయ ఎన్నికలకు ప్రాధాన్యం

లండన్, సెప్టెంబరు 5: వైస్రాయి ... ఈ వారం లో ఇంకోసారి బ్రిటిషు మంత్రులను కలుసుకుంటారని తెలుస్తున్నది.

సంప్రతింపులు ముగిసినట్టు చేరాయన్నీ, వైస్రాయి వచ్చేవారం చివరలో ఇక్కడనుంచి వెళ్లిపోవచ్చుననీ కూడా తెలుస్తున్నది.

### మంత్రివర్గసంఘ సమావేశం

భారతదేశం విషయమై సమాలోచించేందుకు మంత్రివర్గసంఘ సమావేశం జరిగినదని యునైటెడ్ ప్రెస్ విలేఖరి వ్రాశాడు. ఈ సమావేశంలో ఎవరెవరు పాల్గొన్నారో అధికారరీత్యా వెల్లడికాలేదు. బహుశా అట్లీ, పెథిక్ లారెన్స్, స్టాన్సేట్, ఆర్థర్ హెండర్సన్, స్టాఫర్డ్ క్రిప్సు, మిస్టెర్ ఎలెన్ విల్కిన్సన్, లార్డు వేవెల్ పాల్గొనిఉంటారనుకోవచ్చు.

వైస్రాయి తెలిపిన దానినిబట్టి భారతదేశ పరిస్థితిని సమాలోచనచేయడం పూర్తి అయింది. సంప్రతింపులలో మొదటిభాగం ముగిసింది. ఇకమీదట మంత్రులు, రాజు ప్రసంగంలో సూచించిన రీతిగా స్వాతంత్ర్య మైనంత త్వరలో స్వపరిపాలన ఏర్పరచడానికి ఏమిచేయాలన్న విషయమై ఆలోచిస్తారు.

### రాష్ట్రీయ ఎన్నికలు

వైస్రాయ్ భారతదేశం తిరిగి వెళ్లగానే రాష్ట్రీయ ఎన్నికల విషయమై శ్రద్ధ వహిస్తాడనుకోవచ్చు. భారతదేశ రాజ్యాంగ నిర్మాణసంఘం అయిన ప్రజాప్రతినిధి పరిషత్తును ఏర్పాటుచేసేందుకు ఎన్నికలు అవసరమని ఆయన అభిప్రాయం.

### పాకిస్థాన్ సమస్య

ఎన్నికల సందర్భంలో పాకిస్థాన్ సమస్య చాలా ప్రధానమైనదని సామాన్యంగా అందరూ అంగీకరిస్తున్న విషయమే. ప్రభుత్వంమటుకు ఒక నిశ్చయానికి రాలేదు. పాకిస్థాన్ విషయమై స్టాఫర్డ్ క్రిప్సు ప్రత్యేకం శ్రద్ధ వహిస్తున్నట్లు తెలుస్తున్నది.

మొత్తంమీద ఈ వారంలో భారత రాజ్యాంగ సమస్య విషయమై నిర్ణయాలు జరుగుతాయి. వైస్రాయ్ ఆఖరిసారి, ప్రధానినీ, విదేశాంగమంత్రి బెవిన్‌నీ కలుసుకుని వచ్చేవారం చివరలో భారతదేశం వెళ్లిపోతాడు.

### ప్రధాన నాయకులతో సంప్రతింపులు

వేవెల్ న్యూఢిల్లీ వెళ్లిన తర్వాత మరొక సమావేశం జరుపుతాడో లేదో తెలియదు. కొన్ని ప్రధాన నాయకులను ఆహ్వానించి సంప్రతించవచ్చునని అభిజ్ఞ వర్గాలలో భావిస్తున్నారు. అట్లా జరిగేటట్లయితే, మహాత్మాగాంధీ, మౌలానా అబుల్ కలాం ఆజాద్, పండిత నెహ్రూ, జనాబ్ జిన్నా గార్లకు తప్పకుండా ఆహ్వానాలు వస్తాయి. డాక్టర్ శ్యామప్రసాద్ ముఖర్జీకి కూడా ఆహ్వానం అందవచ్చునని కొందరంటున్నారు.

ప్రజా పరిషత్తు ఏర్పడిన తర్వాత లండన్‌లో చిన్న రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు జరుగుతుందన్న దానిని ఎవరూ కొట్టివేయడం లేదు.

ఈలోగా పెథిక్ లారెన్సు, భారతదేశం తరఫున రాయబారం వస్తున్న పార్లమెంటు సభ్యులను ఈవారం చివరలోగానీ, వచ్చేవారం మొదటిలోగానీ కలుసుకుంటాడు.

### అనధికార రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్సే మొదటిఅడుగు

భారతదేశానికి సంబంధించిన అనేక సమస్యల పరిష్కారానికి అనధికార రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు ఏర్పాటుచేయడమే మొదటిఅడుగు అని, వేవెల్ సంప్రతింపుల వైఖరిని గమనిస్తున్న ఒక బ్రిటిష్ ఉద్యోగి అన్నట్లు అమెరికా అసోసియేటెడ్ ప్రెస్ ప్రతినిధి ఫోబీ దాయాబాలా వ్రాశాడు.

ఆ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సులో, ఎన్నికలు అయినతర్వాత, 11 రాష్ట్రాల ప్రధానమంత్రులూ, అన్ని రాజకీయ, ఆర్థికపక్షాల ప్రతినిధులూ పాల్గొనాలని ఆ ఉద్యోగి అన్నాడు. ఆ కాన్ఫరెన్సు నిత్యం జాతీయసమస్యలను చర్చిస్తూండాలి. ప్రజాప్రతినిధి పరిషత్తుకు అదిమొదటి అడుగు అవుతుందని ఆఉద్యోగిఅన్నాడు.

### రెండుముఖ్యాంశాలు

ఇదిట్లాఉండగా భారతీయ నిపుణులు ఒకటి చెపుతున్నారు. ప్రజాప్రతినిధి పరిషత్తు విషయంలో బ్రిటిష్‌ప్రభుత్వం ఉద్దేశం ఎట్లాఉన్నప్పటికీ రెండు ముఖ్యాంశాలున్నాయి. ఒకటి- సంయుక్త నియోజకవర్గాలుండాలిగాని, ప్రత్యేకనియోజకవర్గము లుండరాదు. రెండు- ఆస్తిప్రసక్తి లేకుండా అందరికీ ఓటుచేసే హక్కుండాలి. ఆస్తిప్రసక్తివలన బ్రిటిష్‌యిండియాలోని 29 కోట్ల 20 లక్షల ప్రజలలో 3 కోట్లమందే ఓటు చేయగలుగుతున్నారు.

## సింగపూర్‌లో మిత్రసేనలప్రవేశం

### శరణాగతిపత్రంపై ఉభయప్రతినిధుల సంతకాలు

### రేడియో చెక్కుచెదరకుండా వశపడింది: పెట్రోల్ కర్మాగారాల విధ్వంసం

లండన్, సెప్టెంబరు 5:

బ్రిటిష్‌సేనలు, భారతసేనలు కలిసి సింగపూరులో ఈ ఉదయం దిగినవని సింగపూర్ రేడియో ప్రకటించింది. పంజాబు రెజిమెంటుకు చెందిన ప్రథమపటాలం ముందు దిగిందని అమెరికన్ అసోసియేటెడ్‌ప్రెస్ విలేఖరివార్త.

లొంగుబాటుషరతులకు భిన్నంగా జపానువారు పోర్ట్‌డిక్సన్‌లోని పెట్రోల్‌గిడ్డంగులను తగలబెట్టారనికూడా ఇదే విలేఖరి తెలియజేస్తున్నాడు.

సింగపూర్ రేడియోస్టేషన్ను చెక్కుచెదరకుండా మిత్రసేనలు వశపరుచుకున్నవి. బ్రహ్మాండమైన నౌకాదళంలో ప్రయాణంచేసి, బ్రిటిష్, భారతసేనలు సింగపూరులోదిగి పునరాక్రమణ ప్రారంభించినవి.

సింగపూర్ దీవిలోని ప్రధాననౌకాశ్రయాలలో ఒకటైన కాలాంగ్‌కూడా భద్రంగా మిత్రసేనల చేజిక్కింది.

బ్రిటిష్ భారతసేనలు విమానాశ్రయంలో దిగగానే, జపాను ఆయుధపరికరాల గిడ్డంగి ప్రధానాధికారి మేజర్ జనరల్ మాకాజిమా కారులోవచ్చి వారిని కలుసుకున్నాడు.

సింగపూరు లొంగుబాటుపత్రంపై సంతకాలు "ససెక్స్" అనే బ్రిటిష్ క్రూయిజరులో జరిగినవి. జపానువారు అమలుపరచిన శాసనాలన్నిటినీ మిత్రఅధికారులు రద్దుచేశారు. కర్‌ఫ్యూ ఉత్తర్వులు జారీఅయినవి.

సింగపూరులో వున్న జపానువారందరు ఫుట్‌బాల్ ఆట స్థలంలో చేరవలసిందని ఉత్తర్వుచేశారు, కౌనింగ్ రేవులో పౌరులెవరూ ప్రవేశించరాదని మిత్రఅధికారులు ఆజ్ఞాపించారు.

లొంగుబాటు పత్రాలపై మౌంట్ బాటెన్ తరఫున లెఫ్టినెంట్ సర్ ఫిలిప్ క్రిస్టిసన్ సంతకం చేశాడు. సింగపూర్‌ను జపానువారు 1942 ఫిబ్రవరి 15-వ తేదీన ఆక్రమించారు. తీవ్ర ప్రతిఘటనానంతరం లెఫ్టినెంట్ జనరల్ ఆర్థర్ పర్సివల్ ఆనాడు శత్రువుకు లొంగిపోవలసివచ్చింది.

సింగపూరులోని ప్రజలందరు తమకు జపానువారు ఇచ్చిన రేషన్ కార్డులను, పర్మిట్లను, రిజిస్ట్రేషన్ దస్తావేజులను పదిలంగా వుంచవలసిందని మిత్ర అధికారులు కోరారు.

అవసరమైతే జపానువారితో యుద్ధం చేయడానికి సిద్ధపడే మిత్రసేనలు సింగపూర్‌లో దిగినవి.

### ఇటగాకి ఏడుపు

బ్రిటిష్ యుద్ధ ఓడ "ససెక్స్"లో లొంగుబాటు పత్రంపై సంతకాల తంతుకు పూర్వం ఎనిమిదిన్నర గంటల సేపు చర్చ జరిగింది. సింగపూర్‌లో జపాన్ నౌకా సేనాధిపతిగా వున్న జనరల్ ఇటగాకీ, అడ్మిరల్ ఫుకుడోమ్ ఉభయులూ సంతకాలు పెట్టవచ్చేసరికి 'భోరున' ఏడిచారని రాయిటర్ ప్రత్యేక విలేఖరి అలాన్ హంఫ్రీస్ వ్రాస్తున్నాడు. మిత్రరాజ్యాల తరఫున రియర్ అడ్మిరల్ స్వింటాన్ హాలెండు, లెఫ్టినెంట్ జనరల్ క్రిస్టిసన్ ఉభయులూ సంతకాలు చేశారు.

సంతకాలు పెట్టవలసిందని అడగగానే జనరల్ ఇటగాకీ, పళ్లు మిటకరించి, పెదిమలు బిగబట్టి, "సంతకం ఎటువైపునుంచి కుడివైపుకు చేయవచ్చా ?" అని ప్రశ్నించాడు.

జపానువారు ఎడంనుంచి కుడివైపుకు వ్రాస్తారు. అందుకే సంతకం మొత్తం ఆరం గుళాల బారు వచ్చింది. అడ్మిరల్ ఫుకుడోమ్ వేగంగానే సంతకం పూర్తిచేశాడు. జపాను సేనానులవద్ద ప్రభుత్వసీళ్లు లేనందున సంతకాల సమయంలో చిన్న చిక్కు ఏర్పడింది. పత్రం చివర ప్రత్యేకంగా ఒక గుర్తుపెట్టి ఈ చిక్కును తప్పించారు. పైన చెప్పిన ఇద్దరూ గాక ఇంకో ఏడుగురు బ్రిటిష్ ప్రతినిధుల సమక్షంలో సంతకాలు జరిగినవి.

సింగపూర్ ఖైదీల శిబిరాలలో 15000 మంది భారతీయ ఖైదీలు వున్నారు. మిత్రసేనలు 1942 లో జారిపోయినప్పుడు 52,000 మంది భారతీయులు వుండేవారు.

జపానువారిని యెక్కడ ఖైదీలుగా వుంచడమనే ప్రశ్న వచ్చింది. జహోర్ ప్రాంతానికి తీసుకు పోదామనుకున్నారు. ఇంతలో తమకు నివాసస్థానాలను నిర్మించుకుంటున్నామని ఇటగాకీ అన్నాడు.



## రాష్ట్రకార్యవర్గసభ: సెప్టెంబరు 17

బెజవాడ, సెప్టెంబరు 5: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యసంఘం సెప్టెంబరు 17 మధ్యాహ్నం 2 గంటలకు మద్రాస్ మహాజనసభహాలులో సమావేశమగునని అధ్యక్షుడు టంగుటూరు ప్రకాశంగారు తెలుపుతున్నారు.

## రంగూనుకు జపాను సేనానుల రాక

రంగూను, సెప్టెంబరు 5: లెఫ్టినెంట్ జనరలు నోమూరా అధ్వర్యం కింద జపాన్ సేనానులు కొందరు ఇక్కడికి వచ్చి, ప్రభుత్వభవనంలో ఒక సమావేశానికి హాజరైనారని అసోసియేటెడ్ ప్రెసు ప్రత్యేక విలేఖరి శివశంకరం వ్రాస్తున్నాడు.

ఈ జపాన్ సేనానులు రంగూనులో కొన్ని రోజుల పాటు వుంటారు. వీరితో చాలా మంది దుబాషులు, గుమాస్తాలు కూడా వున్నారట.

## "ఏటంబాంబు పడకపూర్వమే జపాను దాదాపు ఓడిపోయింది"

### జపాను పతన హేతువులు:

### పార్లమెంటులో ప్రధాని హిగాషికునీ ప్రసంగం

లండన్, సెప్టెంబరు 5: పార్లమెంటులో ప్రధాని హిగాషీకునీ, ఏ పరిస్థితులలో జపాను లొంగిపోయిందీ తెలియజేస్తు ఈ విధంగా ప్రసంగించాడని జపాను న్యూస్ ఏజెన్సీ తెలుపుతున్నది:

"హిరోషిమాపై ఏటంబాంబు పడకపూర్వమే, మిత్రి విమానదాడుల ఫలితంగానూ, సముద్రమార్గాల దిగ్బంధంవల్లా, జపాను ఇంచుమించు ఓడిపోయింది. జపాన్ సేనలను గ్వాడాల్ కెనాల్‌నుంచి ఉపసంహరించుకోవలసిన పరిస్థితి ఎప్పుడు ఏర్పడిందో, అప్పటినుంచే, యుద్ధగమనం మిత్రరాజ్యాలకు అనుకూలంగా పరిణమించింది. ఈ సంవత్సరం వసంత ఋతువులో అధిగమించడాని వీల్లేని ప్రతిబంధకాలు ఏర్పడినవి. దేశంలో యుద్ధంవల్ల అందరూ విసిగి వేసారి, అలసిపోయినట్లు చిహ్నాలు స్పష్టంగా కనిపించసాగినవి ... ఉత్పత్తి క్షీణించి పోయింది. దాన్ని పునరుద్ధరించడానికి వీలులేక పోయింది. ముఖ్యంగా ఉక్కు ఉత్పత్తి యుద్ధానికి పూర్వం వున్న దానిలో నాల్గోవంతుకు పడిపోయింది. పెట్రోలు బాగా తగ్గింది. వీటన్నిటివల్లా యుద్ధం సాగించడానికి ప్రాతికూల్యం ఏర్పడింది......... ఓకినావా దీవిని కోల్పోవడంతో, మిత్ర విమాన బలాల విజృంభణ ఎక్కువైంది. చైనాలో రహదారి సౌకర్యాలు ప్రమాద స్థితిలో పడిపోయినవి. మన విమాన నౌకాబలాలు విపరీతంగా నష్టపడసాగినవి. భూతలదళాలు ప్రతిఘటించే ప్రయోజనం లేకపోయింది. మిత్రవిమాన దాడుల ఫలితంగా 2,500,000 ఇళ్లు దగ్ధమైపోయినవి. దాదాపు ఒక కోటిమంది జపాను ప్రజలు యుద్ధంవల్ల బాధపడ్డారు. దేశంలో 25 లక్షల ఇళ్లు బుగ్గిపాలైన అయిపోయినవి.

విశాల ప్రాచ్య ఆసియాలోని వివిధ రంగాలకు చెందిన సేనలను స్వదేశానికి చేర్చడమనేది అతిజటిలమైన సమస్యగా నున్నది. ఇది కొనసాగడానికి చాలాకాలం పట్టవచ్చు. త్వరలో సుసంపన్నంగా యుద్ధపూర్వ పరిస్థితులలో పడతామని అనిస్తే పొరబాటుపడుతున్నట్లే చెప్పవలసి వుంటుంది. దగ్ధమైపోయిన ఇళ్లను తిరిగి నిర్మించడంకూడా పెద్ద సమస్యే.

ప్రభుత్వ యత్నాలు ఫలించకపోయినా ప్రజలు తమమనోనిశ్చయాన్ని సంకల్పాన్ని విడనాడినా, బ్రహ్మాండమైన ఇన్‌ఫ్లేషన్ ప్రమాదాన్ని ఎదుర్కొనవలసి వస్తుంది, నిరుద్యోగ సమస్యను కూడా బహు నిపుణతతో పరిష్కరించవలసి వుంటుంది."

## విశాఖ కలెక్టర్: సిండికేట్‌సభ్యత్వం

గుంటూరు, సెప్టెంబరు 3: గుంటూరు కలెక్టరు టి. భాస్కరరావునాయుడుగారి స్థానే విశాఖ కలెక్టరు యస్. శేషగిరి రెడ్డిగారు ఆంధ్ర యూనివర్సిటీ సిండికేట్ లోను, ఆర్థిక సంఘంలోను సభ్యుడుగా గవర్నరుచేత నియమితులైనారు.

## కమ్యూనిస్టు నాయకులతో చాంగ్‌కైషేక్ సంభాషణలు

### ఇంకా రెండువారాలపాటు జరిగేసూచన

చుంగ్ కింగ్, సెప్టెంబరు 5: జనరలిస్సిమో చాంగ్ కైషేక్, జనరల్ మావో త్సే టుంగ్ మూ పరస్పరాభిప్రాయాలు తెలుసుకోవడం పూర్తి అయిందనీ, ప్రత్యేక సమస్యలమీద సవివరంగా చర్చలు జరుగుతున్నాయనిన్నీ చైనావార్తా సంస్థ నేడు ప్రకటించినది.

జనరలిస్సిమో, జనరల్ మావో త్సే టుంగ్‌ను నిన్న తిరిగి సమావేశమైనారు.

నాయకులిద్దరు ఒక తాత్కాలిక సమాధానానికి వచ్చారు అన్న వార్త సత్యమూ అసత్యమూ అని చైనావార్తా మంత్రియైన డా॥ పి. కే. వూను నేడు ప్రశ్నింపగా అతడు సమాధాన మివ్వలేదు. ఈ వార్త అకాలంగా వచ్చింది అని మాత్రము అతడు అన్నాడు. ఈ వాక్యానికి వివరంగా అర్థం చెప్పమని అడుగగా, నాయకులిద్దరు ఈ విషయాన్ని గోప్యంగా ఉంచదలచారనీ తాను మాట్లాడితే పరిస్థితులు మరింత చిక్కుపడవచ్చుననీ డా॥ వూ అన్నాడు.

డాక్టర్ వూ ఇంకా ఇలా చెప్పాడు: "సంభాషణ లింకా జరుగుతూనే ఉన్నై; ఇంతవరకు రెండుసార్లు సుదీర్ఘ సమావేశాలు జరిగినై. సంభాషణ లింకా రెండు వారాలపాటు జరుగవచ్చునని నా వ్యక్తిగతాభిప్రాయము." నాన్‌కింగ్‌లో జరుగనున్న లొంగుబాటు ఉత్సవంలో పాల్గొనడానికి అమెరికా, బ్రిటన్, రష్యా, ఫ్రాంస్, ఆస్ట్రేలియా, కనడా, నెదర్లాండ్సు ప్రతినిధులను జనరలిస్సిమో ఆహ్వానించాడని డా॥ వూ తెలియజేశాడు.

డా॥ పి. ఎచ్. చాంగ్ ఇలా అన్నాడు: "రాజ్యాంగ నిర్మిత ప్రభుత్వాన్ని త్వరలో స్థాపించవలెనని ప్రజలు, ప్రస్తుత ప్రభుత్వమూ కూడా వాంఛిస్తున్నారు.

నాకు తెలిసినంతవరకు ప్రభుత్వము నేషనల్ అసెంబ్లీని వాయిదా వేయ గోరటం లేదు. బహుశః చుంగ్‌కింగ్‌లోనే నేషనల్ అసెంబ్లీ సమావేశము కావచ్చును. 1946 వ సంవత్సరము ప్రవేశించక మునుపే ప్రభుత్వముయొక్క పరిపాలక శాఖను నాంకింగ్‌కు బదిలీ చేద్దామని అనుకుంటున్నారు."

## సార్వజనిక నియోజనాధికారము

### రాబోవు ఎన్నికలలో కాంగ్రెసువారు కోరెదరు

శ్రీనగరు, సెప్టెంబర్ 5: రాబోవు ఎన్నికలలో, పరిమితమగు నియోజనాధికారమునకు సంబంధించిన సమస్యను గూర్చియు, ముఖ్యముగా కేంద్రశాసన సభ్యుల నెన్నుకొనుటలో సంకుచితము చేయబడిన నియోజనాధికారమును గూర్చియు పూనా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ వారు చర్చించెదరని తెలియుచున్నది.

కాంగ్రెసువారు, వయస్సువచ్చినవారందరికే వోటింగు అధికారము, లేదా దానికి దగ్గరగానుండు యేదేని ఒకపద్ధతిని కోరెదరని కాంగ్రెస్ మహాసభాధ్యక్షునితోను, వర్కింగ్ కమిటీ సభ్యులు అసఫాలీగారితోను సంభాషించుటవల్ల తెలియవచ్చెను. నియోజనాధికారముయొక్క వ్యాప్తిని విస్తరింపజేయ ప్రభుత్వమువారంగీకరించి, తదనుగుణముగా క్రొత్త వోటర్ల పట్టికలను తయారుచేయునెడల స్వల్పకాలము ఎన్నికలను వాయిదా వేయుటకు కాంగ్రెసువారు అభ్యంతరము చెప్పరు.

క్రొత్తగా నెన్నుకొనబడిన శాసన సభలు భారతదేశ భవిష్యత్తుకు సంబంధించిన ప్రధాన సమస్యల ననేకమును నిర్ణయింపవలసిన సమయమున వోటర్లు కాదగిన అనేక లక్షలమందిని పరిగణింపకుండుట కేవలము అన్యాయమని కాంగ్రెస్ నాయకులు వాదించుచున్నారు. ప్రజాసత్తాక ప్రభుత్వసూత్రముల ననుసరించి వీరు దేశము నెదుర్కొనుచున్న ముఖ్య జాతీయ సమస్యలపై అభిప్రాయము వెలిబుచ్చు హక్కు కలిగియున్నారని చెప్పుచున్నారు. ఇట్టివారందరికి ఓటింగు అధికారము చేకూర్చవలెనని ఒక్క కాంగ్రెసువారు మాత్రము 25 సంవత్సరములకు పైగా ఒత్తిడి చేయుచున్నారని అనుచున్నారు.

కాంగ్రెసు వర్కింగ్ కమిటీ కాంగ్రెసువారి ఎన్నికల విజ్ఞప్తిని తయారుచేసి అ. భా. కాం. కమిటీ యెదుట నుంచెదరని గూడ తెలియుచున్నది. స్వయం నిర్ణయాధికార సమస్య విషయమై మహమ్మదీయుల అనుమానములను తొలగించుటకు సర్వ ప్రయత్నములు గావింపబడును. (అ. ప్రె.)

## సతారాలో నెహ్రూ పర్యటనం

### స్థితిగతులను స్వయంగా తెలుసుకునే ఉద్దేశం

("ఆంధ్రపత్రిక" ప్రత్యేక విలేఖరి)

పూనా, సెప్టెంబరు 6: పండిత జవాహరిలాల్ నెహ్రూ వర్కింగుకమిటీ సమావేశానికి ఇక్కడికి వచ్చినప్పుడు ఆయనను సతారాజిల్లా తీసుకువెళ్లడానికి స్థానిక కాంగ్రెస్‌వాదులు ఏర్పాట్లు చేస్తున్నారు. ఇందువల్ల నెహ్రూ సతారాజిల్లాలోని పరిస్థితులను స్వయంగా చూసి తెలుసుకునే అవకాశం కలుగుతుంది. నెహ్రూ రెండు రోజులు జిల్లాఅంతటా సంచారంచేసి, గ్రామస్థులను కలుసుకుని అమాయకులైన గ్రామస్థులనుపోలీసువారు పెట్టినబాధలు తెలుసుకుంటాడు.

ఇప్పుడు అనుకుంటున్నదాన్నిబట్టి నెహ్రూ 16-వ తేదీ పూనా సతారా వెళ్లి 17 సాయంత్రం తిరిగివస్తాడని తెలుస్తోంది.

### సతారా రహస్యోద్యమ నాయకుని అరెస్టు

పూనా, సెప్టెంబరు 5: సతారాజిల్లా కరడ్ తాలూకాలో రహస్యంగా రాజకీయ కార్యకలాపములు సాగించువారికి 'సర్వసేనాధిపతి' యని చెప్పబడుచున్న కేశవగోంకర్ వైద్యా అనే లక్ష్మణరావు కిల్లక్కీ సోమవారమునాడు పోలీసులచే అరెస్టు గావింపబడెను. ఈతడు 1942 సం॥ము నుండి తప్పించుకొని తిరుగుచుండెను. ఈతని అరెస్టుకు తోడ్పడినవారికి 3 వేల రూపాయల బహుమానము ప్రకటింపబడియుండెను. లక్ష్మణరావ్ కిల కరిణి,కరడ్ తాలూకా హింగోల్ గ్రామములో ఒక యింటిలో దాగుకొనియుండగా ఒక పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు ఆ యింటిని ముట్టడించి, ఆతని అరెస్టు చేసెనని తెలియుచున్నది. (అ. ప్రె.)

### బ్రిటిష్ నావికుల ఖాళీ

టోకియో, సెప్టెంబరు 5: వారంరోజు లక్రితం అమెరికన్ సేనలతో యోకోసుకొ వద్ద దిగిన బ్రిటిషునావికులు ఈరోజు తమ తమ ఓడలకు ఖాళీచేసి వెళ్లుతున్నారని రాయటర్ ప్రత్యేకవిలేఖరి వ్రాస్తున్నాడు. టోకియోప్రాంతమంతా పూర్తిగా అమెరికనుల ఆక్రమణకిందనే వుంటుంది. టోకియో అఖాతంలోవున్న బ్రిటిష్ నౌకలను ఇక యుద్ధఖైదీలమార్పుకు ఉపయోగిస్తారు.

### 20 ఏళ్లపాటు?

జపానును మిత్రసేనలు 20 సంవత్సరాల పాటు ఆక్రమించవచ్చునని వాషింగ్టన్ నుంచి వచ్చిన ఒకవార్త తెలుపుచున్నది.

### జపాన్ ప్రతిఘటన

రంగూన్, సెప్టెంబరు 5: బర్మాలో చెదురుగా అక్కడక్కడ జపానువారు ప్రతిఘటన సాగిస్తూనేవున్నారు. ముఖ్యంగా టౌంగూకు ఉత్తరంగా ఈ ప్రతిఘటన సాగుతున్నది. జపాను లొంగిపోయిందనే వర్తమానాన్ని కరపత్రాల ద్వారా ఆ శత్రుసేనలకు మిత్ర అధికార్లు అందజేస్తున్నారు. లొంగిపోవలసిందని కోరగానే జపాను సైనికులు మిత్రసైనికులపై తుపాకులు కాల్చారని తెలుస్తున్నది. అక్కడక్కడవున్న జపానువారికి లొంగుబాటు కబురు అందజేయడం కష్టసాధ్యంగా పరిణమించింది.

## నోటీసు

బెజవాడ డి॥ ము॥ కోర్టులో

O. S. 476/45.

వాదులు:- సుంకు లక్ష్మీనరసింహం వగైరాలు.

ప్రతివాదులు:- సౌదాగరు మహమ్మదు ఖాసిం సాహెబు వగైరా.

ఈ నెంబరు వాదులు వుయ్యూరు గ్రామంలోని హిందువుల ప్రతినిధులుగా యీ నెంబరు ప్రతివాదులును సై వుయ్యూరు గ్రామంలోని మహమ్మదీయులకు ప్రతినిధులుగా దావా దాఖలుచేయుటకు పర్మిషన్ నిమిత్తం సివిల్ మిస్ లు దాఖలుచేసి పర్మిషన్ పొందినారు. సదరు దావా 24-9-1945 తేదికి హాయిదా అయియున్నది. కనుక పార్టీలుగా చేరవలదినవారు చేరవచ్చును.

బెజవాడ,
3-9-1945. } మునునూరి వెంకట రామయ్య.

## ప్రకటన

నెల్లూరుజిల్లాబోర్డు, నెల్లూరు

ఇందువల్ల యావన్మందికి తెలియ

జేయుట యేమనగా, కోవూరు వాస్తవ్యులు కీ॥ శే॥ శేషురెడ్డి సన్నపురెడ్డి శేషురెడ్డిగారు తే 22-11-1939 ది వ్రాసిన వీలునామావల్ల నెల్లూరుజిల్లాబోర్డుకు సంక్రమించి నెల్లూరు జిల్లాబోర్డువారి స్వాధీనంలోవుండు భూములను విక్రయించుటకు నెల్లూరుజిల్లా కోర్టు వారు 1945 సంవత్సరపు ఓ. పి. నెం 9 యందు యిచ్చిన ఉత్తర్వు యిచ్చినందున 1945 సం॥ సెప్టెంబరునెల తే 17 ది ములుమూడి గ్రామములోని భూములను, తే 19-9-1945 ది కోవూరు గ్రామములోని భూములను సదరు గ్రామముల చావడీలవద్ద బహిరంగముగా యేలందార్వారా విక్రయించబడును. సదరు యేలములలో పాటలు పెట్టను ఉద్దేశించువారు సదరు భూములయొక్క వివరములను యేలం షరతులను నెల్లూరుజిల్లాబోర్డు ఆఫీసునుండి స్వయముగాగాని లేక వ్రాతమూలముగాగాని తెలుసుకొనవచ్చును.

| District Board office, Nellore. Dated 29—8—1945. | (Sd.) P. Govindu Reddy, President. |
|---|---|

## నోటిఫికేషన్

మదరాసు యూనివర్సిటి

తెలుగులో శాస్త్రగ్రంధప్రచురణ

ప్రోత్సాహమునకుగాను, రామారాయనింగారి ప్రయిజు యెండోమెంటు క్రింద తెనుగులో మానవశరీరశాస్త్రము గురించి దేహనిర్మాణముల ప్రత్యేక వివరణముతో వ్రాయబడిన ఉత్తమగ్రంథమునకు విశ్వవిద్యాలయమువారిచే సుమారు రు 500/- ల బహుమతి యివ్వబడును. కావలసిన వివరములతో వ్యాసము రిజిష్ట్రారుగారికి 1946-వ సం॥ ఆగస్టు 1-వ తేదిలోగా అందునట్లు పంపవలెను. మిగతా విషయములకు వ్రాసి కనుగొనవచ్చును.

(అనుమతిని)

యూనివర్సిటీ బిల్డింగ్సు సేపాక్, మదరాసు.
28 ఆగస్టు 1945. } W. McLEAN, Registrar.

## శ్రీ గౌతమీ విద్యాపీఠ వార్షికోత్సవాలు

రాజమండ్రి, సెప్టెంబరు 1: శ్రీ గౌతమీ విద్యాపీఠ వార్షికోత్సవాలు ఆగస్టు 25 నుంచి 30 దాకా హిందూ సమాజం హాలులో జరిగినవి. ఈ సందర్భంలో ప్రతిరోజూ సాహిత్యసభలు జరిగినవి. ఈ సభలకు రాయసం వెంకటశివుడు, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, పిసుపాటి చిదంబరశాస్త్రి, పుల్లెల ఉమామహేశ్వర పండితులు, వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి, వేదాంతం శేషాద్రిశాస్త్రి, మరుమాముల శంభన్నశాస్త్రి గార్లు క్రమంగా అధ్యక్షత వహించారు.

సంస్కృత ప్రాశస్త్యం పోటీపరీక్షల విధానమును గూర్చి పిసుపాటి చిదంబరశాస్త్రి, పుల్లెల ఉమామహేశ్వర పండితులు, యరసూరి మల్లికార్జునరావు, ముదుంబై వెంకటనరసింహాచారి, కస్తూరి సుబ్బారావు, వేదుల రామశాస్త్రి, భమిడిపాటి తిమ్మయ్య, మద్దూరి శివరామకృష్ణయ్య గార్లు మాట్లాడారు. త్రైతసాధ్య త్రికర్మలను గూర్చి శ్రీ పాద లక్ష్మీనరసింహ సోమయాజులుగారు, పూర్వ ఉత్తర మీమాంసలను గూర్చి కందాడై రామానుజాచార్యులుగారు, మరుమాముల శంభన్నశాస్త్రిగారు ప్రస్థానత్రయాన్ని గూర్చి కడియాల సీతారామశాస్త్రిగారు ద్వైతాద్వైతాలను గూర్చి మాట్లాడారు. పొన్నలగడ్డ సత్యనారాయణగారు ఆర్యుల మహాత్మ్యమును గూర్చి ఉపన్యసించారు. పిసుపర్తి సుబ్రహ్మణ్య శాస్త్రి, పిసుపర్తి కృష్ణమూర్తిశాస్త్రి, పిసుపర్తి వెంకటరమణ సిద్ధాంతి, భమిడిపాటి తిమ్మయ్య సిద్ధాంతి గార్లు జ్యోతిష శాస్త్రాన్ని గూర్చి మాట్లాడారు. మరి త్రయ సామరస్యాన్ని గూర్చి ఎస్. శ్రీనివాసాచారిగారూ, కొట్లారి సోమశేఖర శాస్త్రిగారు దర్శనాలను గూర్చి మాట్లాడారు. మహేంద్రవాడ సుబ్బారాయ శాస్త్రిగారు వ్యాకరణ శాస్త్రములను, చల్లా సుబ్బారాయశాస్త్రిగారు మంత్రశాస్త్రం, కర్రా అగ్నిహోత్రశాస్త్రిగారు వేదవేదాంగాలను, కందాళం నరసింహాచార్యులుగారు రామాయణం విశిష్టాద్వైతములను, కుంటేటి పద్మనాభశాస్త్రిగారు ఋగ్వేదం, దాని అభివృద్ధి- చిర్రావూరి అనంతపద్మనాభశాస్త్రిగారు పురాణాలను గూర్చి మాట్లాడారు.

### కవితా ప్రదర్శనం

పిసుపాటి చిదంబరశాస్త్రిగారు తాము ఆంధ్రీకరించిన పద్మపురాణంనుంచి కొన్ని ఘట్టాలు చదివారు, గోరు సంపు అచ్యుత సూర్యనారాయణ, ఉంపరాల సూర్యనారాయణశాస్త్రి, పిలకా గణపతిశాస్త్రి, వేరం వెంకటాచలపతి, ముక్కవిల్లి అన్నపూర్ణశాస్త్రి, ముదుంబై వరాహ నరసింహాచారి, వేదుల రామారావు, వాసా సూర్యనారాయణశాస్త్రి, శ్రీపాద సోమేశ్వరశాస్త్రి, లక్కావజ్ఝల వెంకటకృష్ణశాస్త్రి, పారుపూడి చలమయ్యశాస్త్రి ఉమామహేశ్వర పండితులు గార్లు పాల్గొన్నారు.

పై విద్యాపీఠంవారు సంస్కృతాంధ్ర కవిత్వాల్లో పోటీపరీక్షలను ఏర్పాటుచేశారు. తెలుగుకవిత్వంలో పిలకా గణపతిశాస్త్రి, వేదుల రామశాస్త్రి గార్లకూ, సంస్కృత కవిత్వంలో లక్కావజ్ఝల వెంకటకృష్ణశాస్త్రి, వాసా సూర్యనారాయణశాస్త్రి గార్లకూ బహుమతులను ఇచ్చారు. ప్రతిసంవత్సరమూ శరన్నవరాత్రులలో ఈ విధంగానే కవులను సన్మానించటానికిపీఠంవారు తీర్మానించారు.

### ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంధ్రత్వం లేదు

పలువురు ప్రముఖులు ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రణాళికను గూర్చి చర్చించారు. రాయసం వెంకటశివుడు, పిసుపాటి చిదంబరశాస్త్రి, ఉమామహేశ్వర పండితులు, మద్దూరి శివరామకృష్ణయ్యగారలు మున్నగువారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు పాఠ్యగ్రంథ ప్రణాళిక సరిగా లేదు, సంస్కృతానికి సరిఅయిన ప్రోత్సాహం లేదు, శాస్త్రాలను తెలుగులోకి తర్జుమా చేయటానికి ప్రయత్నాలు లేవు, ఆంధ్రభాషకు తగిన ప్రాముఖ్యం ఇవ్వటం లేదు అనీ, ఆంధ్ర ప్రజలు విశ్వవిద్యాలయాన్ని సక్రమ పద్ధతులలో నడిపించటానికి తమ శక్తిని కేంద్రీకరించాలనీ సూచించారు.

### వేదశాస్త్ర పరిషత్తు

గౌతమీ విద్యాపీఠంవారూ, వేదశాస్త్ర పరిషత్తు వారూ కలసి ఈ సాలు పండిత సన్మానం ఏర్పాటుచేశారు. పన్నెండు మంది పండితులు వచ్చారు. మరుమాముల శంభన్నశాస్త్రిగారు సభకు అధ్యక్షత వహించారు, కడియాల ఘనావధానులుగారు కృత్తికాదులయినవారిచే వేదపఠనం చేయించారు, పిరఘుంటల లక్ష్మీనరసింహమూర్తి, జటావల్లభుల పురుషోత్తం మున్నగువారు మాట్లాడారు, శ్రీ విశ్వనాథం జగన్నాథ ఘనాపాఠిగారు ఈ పీఠస్థులయినారు, బహూకరింపబడినారు.

### కందుకూరి వీరరాఘవస్వామిగారి ఆరోగ్యము

రాజమండ్రి, సెప్టెంబరు 4: శ్రీ కం. వీరరాఘవస్వామిగారు రెండు నెలలనుంచి అస్వస్థగా ఉంటున్నారు. పరిస్థితి రెండు రోజులనుంచి ఆదుర్దాగా ఉన్నది.

## పారిశ్రామిక సభ

### బెజవాడలో

కలకత్తా, సెప్టెంబరు 4: ఆంధ్రా మాన్యుఫాక్చరర్ల సంఘం (శాఖ) ఉద్యమ ప్రముఖ పారిశ్రామికులసభ బెజవాడలో సెప్టెంబరు 15, 16-వ తేదీలలో జరుగుతుంది. టి. ఎల్. మహాలో గారు అధ్యక్షులు; అంతర్జాతీయ సహకార సంఘ సభ్యుడు డా॥ బెనహాన్ సింగ్ ప్రారంభోత్సవం జరుపుతారు. గృహ పరిశ్రమల శాఖ ప్రిన్సిపాల్ అగర్వాల్ గారు ప్రారంభిస్తారు. శ్రీ జి. సీతారామశాస్త్రిగారు గృహ పరిశ్రమల శాఖా సమావేశానికి అధ్యక్షులు.

## రాష్ట్ర స్వాస్థ్యము

ఆగస్టు 25 పర్యంత వారంలో క. షు. వ్యాధులవలన 203 మంది కాలం చేశారు. కర్నూలు, కృష్ణా, నెల్లూరు, కడప జిల్లాలలో కలరాయున్నూ, కోయంబత్తూరు, సేలం, జిల్లాలలో ప్లేగున్నూ ప్రబలినవి. మశూచిరాష్ట్రమంతటా తీవ్రంగా నున్నది.

| వ్యాధులు | సోకుడు | చావులు |
|---|---|---|
| కలరా | 277 | 149 |
| మశూచి | 201 | 49 |
| ప్లేగు | 33 | 5 |

## మదనపల్లిలో మళ్లీ ప్లేగు

మదనపల్లి సెప్టెంబరు 1: ప్లేగు మళ్లీ బోయవీధిలో వ్యాపిస్తూ ఉన్నది. 5 గురికి సోకి ఇద్దరు మరణించారు, ప్రభుత్వం ఆస్పత్రిలోనూ, ఘోషా ఆస్పత్రిలోనూ ప్లేగు వచ్చినవారిని ఇప్పుడు చేర్చుకొంటూ ప్రత్యేకించిన వార్డులలో చికిత్స చేస్తున్నారు. ప్రజలు మళ్లీ ప్లేగువచ్చిందని భయపడుతున్నారు.

## ప్లేగు భయము

హిందూపురం, సెప్టెంబరు 4 ఈ ఊరికి చేరువనే ఉన్న మైసూరు సంస్థాన పట్నము గోరిబిదనూరులో ప్లేగు వ్యాపించినది; ప్లేగుబాధ ఇటీవలనే తొలగిన ఈ పట్నానికి అక్కడినుంచి జనంవచ్చి పోతున్నారు. గతసంవత్సరం 8 నెలలపాటు ఊరిబయలుపల నివసించిన ప్రజలుతిరిగి భయగ్రస్తులౌతున్నారు.

## సన్మానము

హిందూపురం, సెప్టెంబరు 3: సత్యప్రకాశిక రామచంద్రరావుగారిని సన్మానించే నిమిత్తము నిన్న సాయంత్రం టౌన్ బ్యాంకులో కల్లూరు సుబ్బారావుగారి అధ్యక్షతన సభ జరిగినది. ప్రజలతరఫున సభాధ్యక్షుడు రామచంద్రరావుగారికి రు 116 లును, ఖద్దరు శాలువలను బహూకరించారు.

హైదరాబాదు, సెప్టెంబరు 3:— శ్రీ దత్తాత్రేయ శర్మగారి అధ్యక్షతన నిన్న సాయంత్రము నిజాం రాష్ట్రాంధ్ర మహాసభ సికిందరాబాదు తాలూకా కమిటీవారు సభచేసి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిని సన్మానించారు. వారిని ఆళ్వారుస్వామిగారు సభవారికి పరిచయం చేశారు. హరిసర్వోత్తమరావుగారు సత్కారానికి తను రీతిని బదులు చెప్పుతూ ఆంధ్రులకు తక్కువ వారమనే భావము ఉండకూడదనియు, అన్ని విషయములను అగ్రేసరులుగ నడచుచున్నామనియు తెలిపి సన్మానమునకు కృతజ్ఞత వెలిబుచ్చారు.

## వార్షికోత్సవము

హైదరాబాదు: సెప్టెంబరు 1: శ్రీ కృష్ణదేవ రాయాంధ్ర భాషానిలయ 44 వ వార్షికోత్సవము ఆగస్టు 29, 30, 31 తేదీలలో చక్కగా జరిగినది. మొదటిరోజు సభకు అధ్యక్షుడుగా గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు గ్రంథాలయోద్యమమును గురించి ముచ్చటించారు. రెండవనాటి సభాధ్యక్షుడు తనికెళ్ల వీరభద్రుడుగారు సంస్కృతభాషనుగురించి ప్రసంగించారు. మూడవరోజున రాజా బహద్దూరు వెంకటరామారెడ్డిగారి అధ్యక్షతన జరిగినసభలో హరిసర్వోత్తమరావుగారు వయోజన విద్యనుగురించి మాట్లాడారు.

రాజాబహద్దూర్ వెంకట రామారెడ్డిగారు అధ్యక్షుడుగను, అక్కినేపల్లి జానకీరామారావుగారు, వల్లూరి సూర్యనారాయణరావుగార్లు ఉపాధ్యక్షులుగను, బి. విశ్వనాథంగారు కార్యదర్శిగను ఎన్నికలు జరిగినవి.

## ఇద్దరు బందీల విడుదల

గుడివాడ, సెప్టెంబరు 4: శ్రీయుత్. ఆర్. కులకర్ణి, నారపనేని శేషగిరిరావుగార్లను జిల్లా సెషన్సుజడ్జి నిన్న విడుదలచేశారు. గత జూనులో గుడివాడ సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ వీరిద్దరికిని దేశరక్షణ శాసనం ప్రకారం ఏడాదిశిక్ష విధించినారు. కులకర్ణిగారు పూనా లోకశక్తి పత్రికా సంపాదక వర్గమునకు చెందినవారు.

## కీ. శే. భట్రాజు వెంకట్రాయులుగారు

ఏలూరు, సెప్టెంబరు 3: క్రిమినల్ లాయరుగా పేరుపొందిన భట్రాజు వెంకట్రాయులుగారు వ్యాధిపీడితులై నిన్న మధ్యాహ్నం 12 గంటలకు 70 వ యేట మరణించారు.

## భారత కమ్యూనిస్టుల భవిష్యత్తు

### బి. శివరావుగారి అభిప్రాయం

మాంచెస్టర్, సెప్టెంబరు 4: భారత దేశములో భవిష్యద్రాజకీయ రంగములో కమ్యూనిస్టుల స్థితినిగురించి "మాంచెస్టర్ గార్డియన్" పత్రికలో శివరావు ఒక వ్యాసము ప్రకటించినాడు."

ఆ వ్యాసములోని ముఖ్యాంశములు.

కిందటి ఇరవై సంవత్సరాల లోనూ భారత దేశములో కమ్యూనిస్టుల కార్యక్రమాన్ని గురించి చెప్పిన తరువాత ఈ విధముగా వ్రాసినాడు.

"అన్ని రాజకీయ సంస్థలలోనూ అనగా కాంగ్రెసులోనూ ముస్లింలీగులోనూ వుమెన్స్ కాన్ఫరెన్సులోనూ - ట్రేడ్ యూనియన్లలోనూ రైతు సంఘాలలోనూ చిన్నచిన్న జట్లు కమ్యూనిస్టులు బయలు దేరినారు.

ఇక ముందువారు ఏ పద్ధతిని అనుసరిస్తారో నిర్ణయించడము చాలా కష్టము. యుద్ధసమయములో తమ సంస్థలను బలపరచుకోడానికి అతి నిపుణముగా అవకాశాలను ఉపయోగించుకొన్నారు. పూర్వముకన్నా యిప్పుడు వారికి పలుకుబడి యెక్కువ. బలవంతులున్నూ అయినారు.

అనేక విషయాలమీద, ఇదమిత్థముగా ఇప్పుడు నిర్ణయించడానికి వీలుకాని అనేక విషయాలమీద, వారి భవిష్య ద్విధానము ఆధారపడుతుంది. ఎంతవరకు కమ్యూనిస్టులున్నూ సోషలిస్టులున్నూ తమ అభిప్రాయ భేదాలను పోగొట్టుకొని భూస్వాములను ఎదిరించగలరో చూడవలసిఉంది. ఇది భారత దేశానికి సంబంధించినంతవరకూను అని చెప్పవచ్చును. ఇక విదేశాంగముగా నయితే శాన్ ఫ్రాన్సిస్కో సమావేశములో సోవియెట్లకు ఆసియాఖండవాసుల విషయములో యిదమిత్థమయిన వైఖరిలేదని మలటావ్ తెలియజెప్పినాడు.

## 'నేను పిరికిగుండె వాణ్ణి కాను'

### అబ్దుల్ కయూమ్ ఘోష

పెషావర్, సెప్టెంబర్ 4: 'నేను ముస్లింలీగులో చేరిన విషయమై డా॥ ఖాన్ సాహెబ్ చేసిన ప్రకటనను చూశాను. ఈ విషయమై అసలు నే నెవరితోనూ వివాదపడ తలచుకోలేదు. డా॥ఖాన్ సాహెబ్ కల్పించాడు కనుక తప్పడంలేదు.' అని అబ్దుల్ కయూం ఇవ్వాళ ఒక ప్రకటన చేశాడు.

ప్రకటనలో ఇంకా ఇట్లా ఉంది: 'నేను పిరికిగుండె వాడినవడంవల్లనే కాంగ్రెసులోనుంచి వెళ్లిపోయాననీ, అది కాంగ్రెసుకే మంచిదనీ ఖాన్ సాహెబ్ ఏదో వెనదతీరినట్లు మాట్లాడాడు. 1934 లో కాంగ్రెస్ లో చేరినది లగాయతు నేను సమయంవచ్చినప్పుడల్లా ఖాన్ సాహెబు తోపాటు త్యాగంచేస్తూనే వచ్చాను.

'1942 లో ఆగస్టు ఉద్యమం ప్రారంభింపబడినప్పుడు నేనూ అందులో చేరి 42 సెప్టెంబరునుంచి 43 మే వరకూ ఖాన్ సాహెబ్ తోపాటు పల్లెపల్లెకూ వెళ్లి సత్యాగ్రహులను చేర్చుకోవడంలో పనిచేశాను. వారే న్యాయస్థానాలపై దొమ్మీలు చేశారు. సర్ జార్జి కన్నింగ్ హాం ప్రభుత్వం వేరు దారి తొక్కింది. మేమంతా పనిచేస్తున్నా మర్దాన్ జిల్లా వెలుపల ఎవ్వర్నీ అరెస్టు చేయలేదు.

'గఫర్ ఖాన్ ఆజ్ఞప్రకారం 42 ఆగస్టు నుంచి 45 మేవరకూ నేను ప్లీడరీవృత్తి మానుకున్నాను. నా జీవనోపాధి అదే. ఆకాలంలో ఖాన్ సాహెబ్ తన డాక్టరు వృత్తి జరుపుకొనే జరుపుతున్నాడు. కనక నేను పిరికిగుండెవాడినని ఖాన్ సాహెబ్ అనడం శుద్ధ అబద్ధం.'

## భీమవరానికి మ్యునిసిపాలిటీ

భీమవరం, సెప్టెంబరు 2: లోకల్ బోర్డ్సు డిప్యూటీ ఇనస్పెక్టరు క్యాప్టెన్ డి. జ్ఞానవేలుగారు యీ పంచాయతీబోర్డు తనిఖీచేశారు. పంచాయతీ ప్రస్తుతం వేస్తూన్న పన్నులు నిత్యవ్యవహారాలకు మాత్రం సరిపోతూన్నవన్నారు. భీమవరం గ్రామముఖ్యాన్ని జనాభానూ గమనిస్తే త్వరలో మ్యునిసిపాలిటీచేసి, ఎలెక్ట్రిసిటీ, మంచినీటి వసతి, మంచి రోడ్లు మున్నగు సౌకర్యాలు సమకూర్చితే వీలవునన్నారు. మ్యునిసిపాలిటీ గా చేయడానికి వీరు సుముఖంగా నున్నారు.

## పంచాయతీబోర్డుకై కృషి

తాడేపల్లిగూడెం, సెప్టెంబరు 1:— గూడెంపల్లి, కడకట్ల గ్రామాలు తాడేపల్లిగూడెం పంచాయతీబోర్డులో కలిపినప్పటినుంచీ ఆ గ్రామస్థుల సౌకర్యార్థం ఏమీ జరగనందువల్ల, ఆ గ్రామస్థులు సమావేశమై అనేక సమస్యలను గురించి అధ్యక్షులను సమావేశపరచి, తమ అసంతృప్తిని తెలుపుతూ తీర్మానించారు. తమ కొరకు పంచాయతీబోర్డుకై కృషిచేయడానికి అధ్యక్షునికి అధికారం ఇస్తూ తీర్మానించారు.

### వనవపల్లి

ఆర్. వి. వెంకటరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన సభకు 2000 మంది హైందవులు వచ్చారు. యస్. రామకృష్ణ, ఓ. యార్. వెంకట్రాములు గార్లు ఉపన్యసించారు.

## అన్నదాన ధర్మము

శ్రీ ఎస్. వి. ముత్యాలకృష్ణరెడ్డి, వారి భార్య శ్రీమతి కృష్ణమ్మాళ్ గార్లు, దక్షిణ ఆర్కాటుజిల్లా, తిండివనం తాలూకా, కొత్తపల్లె గ్రామములో, కృష్ణమ్మాళ్ తండ్రిగారైన ఆదినారాయణరెడ్డిగారిగారి 17-వ వ్రతవార్షికోత్సవము 1945 ఆగస్టు 23-వ తేదీన జరిపియున్నారు. ఈ సందర్భమున 3,000 మంది బీదలకు ఆదిద్రావిడులతో సహా అన్ని మతములకు, కులములకు చెందినవారికి 1945 ఆగస్టు 24, 25 తేదీలలో అన్నదానము గావింపబడెను. ఇపుడు అన్నదానము చేయబడినవారితో మొత్తము సంఖ్య 87,500 అయినది. స్త్రీ పురుషులలో వృద్ధినారికి, కుంటివారికి వస్త్రదానముగూడ చేయబడినది.

3-9-45 } వి. ముత్యాలకృష్ణరెడ్డి
కృష్ణమ్మాళ్.

## EDUCATIONAL

వైద్యశాస్త్రములో ఒక డిప్లొమా కోర్సుకు అభ్యర్థులకు రు. 40-8/ 2-65 స్కేలుమీద శ్రీ పురుషులలో అభ్యర్థులనుంచి దరఖాస్తులు 1945 సెప్టెంబరు 15 తేదీవరకు తీసికొనబడును. మిగతా వివరములకు 28-8-1945 లోకల్ వార్తా సెంట్ జార్జి గెజిట్ పార్టు 1-బ లో చూడవచ్చును.

టి. భాస్కరమీనన్,
ప్రిన్సిపాల్, ఆంధ్ర మెడికల్ కాలేజ్,
విశాఖపట్టణము 1-9-45.

